శ్రీః.

# స్తోత్రమఞ్జరి.

## చతుఃశ్లోకి, అష్టశ్లోకి

ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారిచే
వ్రాయంబడి

పూర్వాకం - నంబెరుమాళ్ శెట్టిగారిచే
చెన్నపురి
డి. వైట్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

కాపీరైట్.] 1905 [వెల 0-4-0

శ్రీః.



# స్తోత్రమఞ్జరి.

# చతుఃశ్లోకి; అష్టశ్లోకి.



ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారిచే
వ్రాయంబడి,

పూర్వాకం - నంబెరుమాళ్ శెట్టిగారిచే
డినైఙ్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మద్రాస్.

1905

 [వెల 0-4-0.

శ్రీః
శ్రీమతేరామానుజాయనమః.

---

# శ్రీ ఆళవందార్ వైభవ సంగ్రహము.



శ్రీ సింహాసనాంశ సంభూతులైన శ్రీ ఆళవందారులకు

అవతారస్థలము:— చోళదేశమున కావేరీతీరమున వీరనారాయణపురము; అనగా కాట్టుమన్నార్ కోవెల.

తిరునక్షత్రము:— కలియుగము మూడు వేల డెబ్బదియేడు సంవత్సరములకుమీద ధాతుసంవత్సరము కర్కటకమాసము పౌర్ణమీ శుక్రవారము ఉత్తరాషాఢానక్షత్రము విష్కంభయోగము భవకరణము.

తాతగారు:— నాథమునులు

తండ్రిగారు:— ఈశ్వరమునులు

తల్లిగారు:— శ్రీరంగనాయికి.

కుమారులు:— తిరువరంగ ప్పెరుమాళరయర్, తెయ్వత్తుక్కరశు నంబి, పిళ్ళైయరశునంబి, శొట్టైనంబి.

వంశము:— అజానశుద్ధ శ్రీశఠమర్షణము.

తిరునామములు:— యామునాచార్యులు,యమునైత్తురైవర్,వాది మత్తేభసింహేంద్రర్, శ్రీయాళవందార్, పెరియముదలియార్.

వీరి పూర్వులు వసించిన స్థలము:— కాట్టై.

తిరువారాధనము:— నంబెరుమాళ్ (శ్రీరంగనాయకులు).

వాసస్థలము:— శ్రీరంగము.

ఆచార్యులు:— వీరి తండ్రిగారైన నాథమునులు యామునాచార్యులను తిరునామమును, భగవత్సంబంధమును, మంత్రోపదేశమును ప్రసాదించి; తత్త్వహిత పురుషార్థములు ప్రసాదించుటకు ఉయ్యక్కొండారులను, యోగరహస్యములు ప్రసాదించుటకు కురుకావలప్పన్ గారిని నియమించిరి. అయినను ఉయ్యక్కొండార్ శ్రీరామమిశ్రులకు నియమించిరి. కాబట్టి పురుషార్థములును భగవద్విషయమును నాలాయిరమును చతుర్థాశ్రమస్వీకారమును ఈ మొదలగు అర్థవిశేషము లన్నియును ప్రసాదించినవారు శ్రీరామ మిశ్రులు. కావున వీరికి ఆచార్యులు శ్రీమన్నాథమునులు. పురుషకారులు శ్రీరామమిశ్రులు. గురుపరంరా ప్రకారముగా వీరికి ఆచార్యులు శ్రీరామమిశ్రులు.

శిష్యులు:— పెరియనంబి, పెరియ తిరుమలనంబి, తిరుక్కోట్టియూర్ నంబి, తిరుమాలై యాండాన్, దేవారియాండాన్, వానమామలై యాండాన్, ఈశ్వరాండాన్, జియ్యరాండాన్, ఆళవందారాళ్వాన్, తిరుమోహూరప్పన్, తిరుమోహూర్ నిన్నార్, తేవప్పెరుమాళ్, మారనేరినంబి, తిరుక్కచ్చినంబి, తిరువరంగప్పెరుమాళరైయర్, తిరుక్కురుహూర్ దాసర్, వకుళాభరణసోమయాజి, అమ్మంగి, ఆళ్ కొండి, గోవిందదాసర్, రాజపురోహితం నాథమునిదాసర్, రంగచోళాళన్, రాజపత్ని శ్రీరంగమ్మ.

యామునాచార్యులు ప్రసాదించిన గ్రంథములు:— స్తోత్రరత్నము, సిద్ధిత్రయము, శ్రీగీతాసంగ్రహము, ఆగమప్రామాణ్యము, చతుశ్శ్లోకి.

వీరు చతుర్వేదషట్ఛాస్త్రాది సకలవిద్యాపారములను శిష్యులకు బోధించుచు నూటయిరువదైదుసంవత్సరములు వేంచేసియుండి శ్రీరంగనాథునియనుజ్ఞాప్రకారము నిత్యవిభూతియైన పరమపదమలంకరించిరి.

శ్రీమతే యామునమునయేనమః.

---

శ్రీః.

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీపరాశర భట్టార్య వైభవ సంగ్రహము.



శ్రీపరాశరాంశ సంభూతులైన శ్రీపరాశర భట్టరు యొక్క అవతారస్థలము:— చోళదేశమున ఉభయకావేరీ మధ్య ప్రదేశమైన శ్రీరంగము.

అవతారకారణము:— కూరత్తాళ్వారులదేవిగారు కోరినప్రకారముగా శ్రీరంగనాయకస్వామి ప్రసాదమును బంపగా ఆ ప్రసాదమును స్వీకరించిన కారణమున పరాశరభట్టరును వేదవ్యాస భట్టరును అవుడబిడ్డలుగాపుట్టిరి. శ్రీరంగనాథస్వామి వీరిని పుత్రస్వీకారముగా చేసికొనిరి.

తిరునక్షత్రము:— కలియుగము తొమ్మన్నూట యెనుబదిమూఁడు సంవత్సరములకు మీఁద శుభకృతు సంవత్సర వైశాఖ శుద్ధపూర్ణిమా బుధవారము అనూరాధా నక్షత్రము.

తండ్రిగారు:— కూరత్తాళ్వారులు.

తల్లిగారు:— ఆండాళమ్మగారు.

వీరిపూర్వులున్న స్థలము:—కాంచీపురమునకు సమీపమందుండు కూరము.

జాత్యాదులు:—వడమ బ్రాహ్మణులు, హారితగోత్రము, యజుశ్శాఖ, ఆపస్తంబసూత్రము.

తిరునామములు:— పెరియభట్టర్, పరాశరభట్టర్, వేదాంతాచార్యభట్టర్, తిరువరంగప్పెరుమాళ్ భట్టర్

పరాశరభట్టార్యులపత్ని:— మన్నియమ్మగారు.

తిరువారాధనము:— అళగసింగర్.

వాసస్థలము:— శ్రీరంగము

శిష్యులు:— నంజీయర్, నలంతిగళ్ నారాయణజీయర్, కటకత్తు పిళ్లై, అమ్మణియాళ్వాన్, వీరశిఖామణివల్లభరాయన్, పిళ్లైవిళప్పరయర్, నంబిగోవర్ధనదాసర్, శెడియొడుత్తానల్లాన్, మొదలగువారు.

ఆచార్యులు:— శ్రీరామానుజులు పరాశరభట్టరు అని తిరునామముంచి, ఎంబారులను సకలార్థములను ప్రసాదించుటకు నియమించిరి. కావున ఎంబారులు పరాశరభట్టులకు పంచసంస్కారములును, తిరు

వాయ్ మొళి మొదలగు దివ్యప్రబంధములును, ఈడు మొదలగు వ్యాఖ్యానములును ప్రసాదించిరి. కావున వీరికి ఆచార్యులు ఎంబారులు. శ్రీభాష్యాది గ్రంథములును జాతకర్మ నామకరణ చౌలోపనయనాది సత్కర్మములను ప్రసాదించినవారు కూరత్తాళ్వారులు.

పరాశరభట్టులు రచియించినదివ్యగ్రంథములు:— శ్రీరంగరాజస్తవము, శ్రీ గుణరత్నకోశము, విష్ణుసహస్రనామ భాష్యము, క్రియాదీపము, అష్టశ్లోకి, చతుశ్శ్లోకి, ద్వయశ్లోకి, తనిశ్లోకి.

వీరు తమ ఏఁబదిరెండుసంవత్సరములకుమీఁద జయసంవత్సరము కార్తీకమాస శుక్లపక్ష ద్వాదశీదినమున పరమపదమలంకరించిరి.

శ్రీ పరాశరభట్టార్యాయనమః.

---

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

శ్రీః.

# చతుఃశ్లోకి.



## టీకాతాత్పర్యసహితము.



తనియన్.

శ్లో. యత్పదాంభోరుహధ్యాన
విధ్వస్తాశేషకల్మషః,
వస్తుతాముపయాతోఽహం
యామునేయం నమామ్యహమ్.

టీక. అహం = నేను
యత్ = ఏ ఆళవందారులయొక్క
పదాంభోరుహ = పదకమలములయొక్క
ధ్యాన = ధ్యానముచేత
విధ్వస్త = నాశముచేయఁబడిన
అశేష = సమస్తమైన

కిల్బిషః = పాపములుగలవాఁడనై
వస్తుతాం = ఒకవస్తువుగానుండుటను
ఉపయాతః = పొందినాఁడనో
తం = ఆయొక్క
యామునేయం = యమునాదేవి కుమారులైన ఆళవందారులను
నమామి = నమస్కరించుచున్నాఁడను.

తా. శ్రీ ఆళవందారులనెడు ఆచార్యులయొక్క పదకమలములను ధ్యానముచేసి దానిచే సకలపాపములనుండి తొలఁగినవాఁడనైన నేను ఒకవస్తువుగా నుండుటంబట్టి యమునా సూనులైన ఆచార్యులను సేవించుచున్నాఁడను

అవ. మోక్షరూపమహాఫలమును, దానియొక్క సాధనములను భావముగాఁగల వేదాంతవిచార రూపమైన శారీరక మీమాంసయందు నాల్గు అధ్యాయములచేతఁ దెలియఁబడిన భగవంతుఁడైన పరమ పురుషుఁడు సర్వవిధములచేతను ఇష్టమహిషియైన శ్రీమహాలక్ష్మీదేవితోఁ గూడియుండుటవలన, ఆభగవంతుఁడె సర్వాధికుఁడని స్తోత్రరత్నము నందు కైముతికన్యాయముచేత ప్రసాదించి, దానినె ఈస్తోత్రమువలన ప్రకాశపఱచుటకై యత్నించి, ఈ మొదటి శ్లోకమునందు శ్రీ మహాలక్ష్మీదేవి, నిత్యవిభూతికిని లీలావిభూతికిని స్వామినియై యుండుట మొదలుగాఁగల కల్యాణగుణములను కృపచేయుచున్నారు.

శ్లో. కాన్తస్తేపురుషోత్తమఃఫణిపతి
శ్శయ్యాసనంవాహనం
వేదాత్మావిహగేశ్వరోయవనికా
మాయా జగన్మోహినీ,
బ్రహ్మేశాదిసురవ్రజస్సదయిత
స్త్వద్దాసదాసీగణః
శ్రీరిత్యేవచనామతేభగవతి
బ్రూమః కథంత్వాంవయమ్. ౧.

టీ. తే = నీకు
కాన్తః = భర్త
పురుషోత్తమః = పరమపురుషుఁడైన విష్ణువు.
ఫణిపతిః = సర్పరాజైన ఆదిశేషుఁడు
శయ్యా = పాను పు
ఆసనం = ఆసనము.
వేదాత్మా = వేదస్వరూపుఁడైన
విహగేశ్వరః = పక్షిరాజైనగరుత్మంతుఁడు
ఆసనం = ఆసనము

వాహనం = వాహనము.

జగన్మోహినీ = లోకమును భ్రమింపఁజేయు

మాయా = మూలప్రకృతియైనది

యవనికా = తెర.

సదయితః = పత్నులతోఁగూడిన

బ్రహ్మేశాదిసురవ్రజః.

బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు

ఈశ = శివుఁడు

ఆది = మొదలుగాఁగల

సురవ్రజః = దేవసమూహము

త్వద్దాసదాసీగణః=

త్వత్ = నీకు

దాసగణః = భృత్యసమూహముగాను

దాసీగణః = పరిచారికా సమూహముగాను (ఉన్నది).

తే = నీకు

శ్రీరిత్యేవచ = శ్రీఅనియే

నామ = పేరు.

భగవతి = సర్వమంగళగుణములతోఁగూడిన శ్రీమహాలక్ష్మీదేవీ!

వయం = మేము

త్వాం = నిన్ను
కథం = ఏమని
బ్రూమః = చెప్పుదుము.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ ! పరమపురుషుఁడైన శ్రీమన్నారాయణుఁడు నీకు భర్త. ఆదిశేషుఁడుశయ్యగను ఆసనముగనునున్నాఁడు. వేదమూర్తియైన గరుత్మంతుఁడు నీకు వాహనముగను ఆసనముగనునున్నాఁడు. బ్రహ్మదేవుఁడు రుద్రుఁడు మొదలగు దేవతలు నీకు సేవకులుగనున్నారు. సరస్వతి పార్వతి మొదలగుదేవతా స్త్రీలు నీకు ఊడిగములుచేయువారుగనున్నారు. శ్రీయనెడిపేరు నీకుగలిగియున్నది. కావున సకలకల్యాణగుణములతోఁగూడిన నిన్నునెట్లుస్తుతింపగలము? అనఁగా నీయొక్క కల్యాణగుణములు అపారముగాన పొగడుటకెవ్వరికిని సాధ్యముకాదని భావము.

అవ. మొదటిశ్లోకమునందు శ్రీమహాలక్ష్మియొక్క కల్యాణగుణములను సంపూర్ణముగాఁజెప్పుటకు నాకు శక్తిలేదనిచెప్పి, యిప్పుడు శ్రీమహాలక్ష్మియొక్క సౌలభ్యగుణమును అనుసంధించి స్తుతించుటకు సాధ్యము కాకపోయినను దాసులయందు వాత్సల్యముగల శ్రీలక్ష్మీదేవి తమయందు అనుగ్రహముచేయగలదని చెప్పుచున్నారు.

శ్లో. యస్యాస్తేమహిమానమాత్మన ఇవ
త్వద్వల్లభోపి ప్రభుః
నాలమ్మాతు మియత్తయానిరవధిం
నిత్యానుకూలం స్వతః,
తాన్త్వాన్దాస ఇతిప్రపన్న ఇతిచ
స్తోష్యామ్యహన్నిర్భయో
లోకైకేశ్వరి లోకనాథదయితే
దాన్తేదయాన్తేవిదన్. ౨.

టీక. యస్యాః = ఏ
తే = నీయొక్క
నిరవధిం = మేర లేనిదిగాను
నిత్యానుకూలం,
నిత్య = సర్వకాలమును
అనుకూలం = అనుకూలముగను (ఉండునట్టి)
మహిమానం = మాహాత్మ్యమును
ఆత్మనః = తన.యొక్క
మహిమానమివ = మహిమవలెనే

ప్రభుః = సర్వమును నెఱింగినవారైన
త్వద్వల్లభోఽపి,
త్వత్ = నీయొక్క
వల్లభోఽపి = ప్రియుఁడైన భగవంతుఁడుకూడ
ఇయత్తయా = ఇంతమాత్రమని
మాతుం = నిర్ణయించుటకు
నాలం = శక్తుఁడుకాఁడు.
లోకనాథదయితే,
లోకనాథ = లోకములకు ప్రభువైన భగవంతునకు
దయితే = ప్రియురాలైన
లోకైకేశ్వరి = సకలలోకములకు ఒక్కఁడేనాయకుఁడైన
భగవంతునికి మహిషియైన శ్రీమహాలక్ష్మీదేవీ!
దాన్తే = పంచేంద్రియములను నిరోధించిన ప్రపన్నులయందు
తే = నీయొక్క
దయాం = దయను
వివక్ష = తెలియుచున్నాఁడను.
అహం = నేను
తాం = అట్టిమహిమగల
త్వాం = నిన్ను

దాసఇతి = దాసుఁడనియును
ప్రపన్న ఇతి = ప్రపన్నుఁడనియును (ఎంచి)
నిర్భయః = భయములేనివాఁడనై
స్తోష్యామి = స్తుతింపఁబోవుచున్నాఁడను.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ! సర్వము నెఱింగినవాఁడును నీకు ప్రియుఁడును నగు భగవంతుఁడు తనమహిమ నెట్లు ఇంతయని నిర్ణయించి తెలిసికొనలేదో, అట్లు, నిర్ణయింపసాధ్యముకానిదియును సకలచేతనులకును అనుకాలమునునైనయట్టి నీయొక్క మహిమను ఇంతయని నిర్ణయించుటకు శక్తిలేనివాఁడైయున్నాఁడు. అయినను సర్వాపరాధములనుండి తొలఁగినవారైన (నిరపరాధులైన) ప్రపన్నులయందు నీవు మిగులదయతోఁ గూడియుండుటను నే నెఱింగినవాఁడనగుటచేత నీకు దాసుఁడుగను ప్రపన్నుఁడుగనుండు దాసునియందు అనుగ్రహము చేయుదువని అప్రకారమైన మహిమతోడ (అపారమహిమతోడ) గూడిన నిన్ను నుతించుటకు యత్నించినాఁడను.

అవ. రెండవశ్లోకమునందు స్తుతించుటకు సాధ్యముకాని మహిమగల శ్రీ లక్ష్మీదేవిని దాసులును ప్రపన్నులును స్తుతించుటకు పాత్రులను దానిని విన్నపించి, యిప్పుడు శ్రీ మహాలక్ష్మీదేవి ఆశ్రయించువారికి ఫలమొసంగునదియనియును భక్తసులభయనియును పురుషార్థదాయినియనియును నిరూపించుచున్నారు

శ్లో. ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధా
సంధుక్షణాద్రక్ష్యతే
నష్టంప్రాక్తదలాభత స్త్రిభువనం
సంప్రత్యనన్తోదయం,
శ్రేయోనహ్యరవిందలోచనమనః
కాన్తాప్రసాదాదృతే
సంసృత్యక్షరవైష్ణవాధ్వసునృణాం
సంభావ్యతేకర్హిచిత్. 3.

టీ. ఈష......క్షణాత్,

ఈషత్ = స్వల్పమైన
త్వత్ = నీయొక్క
కరుణా = దయకు (కారణమైన)
నిరీక్షణ = కటాక్షమైన
సుధా = అమృతముచేత
సంధుక్షణాత్ = వృద్ధిచేయుటవలన
త్రిభువనం = ముల్లోకములును
రక్ష్యతే = రక్షింపఁబడుచున్నది.

ప్రాక్ = పూర్వము
తదలాభతః,
తత్ = ఆకటాక్షమును
అలాభతః = పొందనిదానివలన
నష్టం = నాశమైనది.
సంప్రతి = ఇప్పుడు
అనన్తోదయం,
అనన్త = అధికమైన
ఉదయం = జన్మముగల్దెను
అరవింద......దృతే,
అరవిందలోచన = పుండరీకాక్షుండైన భగవంతునియొక్క
మనఃకాన్తా = మనస్సున కాహ్లాదకారిణియైన
మహాలక్ష్మీదేవియొక్క
ప్రసాదాదృతే = అనుగ్రహములేక
సంసృత్యక్షరవైష్ణవాధ్వసు,
సంసృతి = సంసారమును
అక్షర = కైవల్యమును
వైష్ణవాధ్వసు = పరమపదమును (అగువీనియందు)
నృణాం = చేతనులకు

శ్రేయః = ప్రయోజనము
కర్హిచిత్ = ఒక్కప్పుడును
నసంభావ్యతే హి = కలుగుటలేదు కదా.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ! నీయొక్క దయకు కారణమైన కటాక్షామృతలేశముచేత ఈ త్రిలోకములయందుండువారును రక్షింపఁబడుచున్నారు. నీకటాక్షములేని సమయమునందు నశించెదరు. మఱలను వారు నీయొక్క కటాక్షమును బొందినయెడల సృష్టింపఁబడెదరు. ఈ యాత్మలకు ఈ భూలోకమునందు ఐశ్వర్యముల ననుభవించుటయందును, కైవల్యమునందాత్మానుభవముచేయుటయందును, పరమపదమునందు బ్రహ్మానుభవముచేయుటయందును, శ్రీమహాలక్ష్మియొక్క దయ లేక ఒకప్పుడును వీరికి శ్రేయస్సు కలుగుటలేదుకదా.

అవ. మూఁడవశ్లోకమునందు త్రిలోకవాసులకును లక్ష్మీకటాక్షము వలన సృష్టిస్థితులుగలుగుచున్నవియనియును,లక్ష్మీకటాక్షములేమిచే వీరికి నాశము కలుగుచున్నదనియును వక్కాణించి, యిప్పుడు శ్రీమహాలక్ష్మీదేవి భగవంతునియొక్క స్వరూపముతోడను, దివ్యమంగళవిగ్రహముతోడను సదా కూడియున్నదనియును, భగవంతునివలెనే మోక్షప్రదురాలనియును జెప్పుచున్నారు.

శ్లో. శాన్తానన్తమహావిభూతిపరమం
యద్బ్రహ్మరూపంహరేః
మూర్తంబ్రహ్మతతోపి తత్ప్రియతరం
రూపంయదత్యద్భుతం,
యాన్యన్యానియథాసుఖంవిహరతో
రూపాణిసర్వాణితా
న్యాహుస్స్వైరనురూపరూపవిభవై
ర్గాఢోపగూఢాని తే. ౪.

టీ. శాన్తానన్తమహావిభూతి,
శాన్త = దోషములులేనిదిగను
అనన్త = లెక్కింపఁగూడనిదిగను
మహావిభూతి = అధికైశ్వర్యముతోఁగూడినదిగను
పరమం = అన్నిఁటికంటెఁ శ్రేష్ఠమైనదిగను
బ్రహ్మ = సర్వవిధములచేతనుమహిమగలదిగను (ఉండునట్టి)
హరేః = భగవంతునియొక్క
రూపం = దివ్యాత్మస్వరూపమైనది

యత్ = ఏదియో
తత్ అపి = ఆ దివ్యాత్మస్వరూపముకంటెను
ప్రియతరమ్ = మిగులప్రియమైనదిగను
మూర్తం = దివ్యమంగళవిగ్రహముతోఁగూడినదిగను
అత్యద్భుతం = మిక్కిలి ఆశ్చర్యమొందఁదగినదిగను(ఉండునట్టి)
తత్ = ఆప్రసిద్ధినిబొందిన
రూపం = పరవాసుదేవరూపమైనది
యత్ = ఏదిగో
యథాసుఖం = సుఖప్రకారము
విహరతః = క్రీడించుచుండు (భగవంతునియొక్క)
అన్యాని = మున్ను చెప్పఁబడినవానికంటె వేఱైన
రూపాణి = వ్యూహవిభవాదులైనరూపములైనవి
యాని = ఏవియో
సర్వాణి = సమస్తములైన
తాని = ఆయవతారములును
తే = నీయొక్క
స్వైః = నీకుఅసాధారణములైనదియును
అనురూపరూపవిభవైః.
అనురూప = తగినట్టిదియును (అగు)
రూప = అవతారములయొక్క
విభవైః — సంపదలచేత

గాఢోపగూఢాని.
గాఢ = దృఢముగాను
ఉపగూఢాని = చేర్పఁబడినవిగాను
ఆహుః = చెప్పుచున్నారు.

తా. క్షుత్పిపాసాది జీవదోషద్వంద్వములేనిదియును, దేశకాల స్వరూపములచేత లెక్కింప శక్యముకానిదియును, అనంతములేనిది యునునైన నిత్యవిభూతియనియును లీలావిభూతియనియును ద్వివిధవి భూతులుగలవియును, అన్నిటికంటె శ్రేష్ఠమైనదియును, అన్నిఁటికంటె అధికమైనదియునునగు భగవంతునియొక్క దివ్యస్వరూపమునందును; రూపౌదార్యాదిగుణములచేత ఆ దివ్యాత్మస్వరూపముకంటెను ధ్యా నముచేయువారికి మిగుల ప్రియమైనదిగను, దానిని సేవించువారికి మిగుల ఆశ్చర్యమొందఁదగినదిగను నుండునట్టి దివ్యమంగళ విగ్రహ ములోఁగూడిన పరవాసుదేవరూపమునందును; మఱియు తమ స్వేచ్ఛా ప్రకారము క్రీడార్థముగాఁ గావింపఁబడియుండు వ్యూహావతారముల నియు విభవావతారములనియు పేరొందిన అవతారము లెవియో, ఆ దివ్యావతారరూపములన్నిఁటియందును; ఆయారూపములకుఁ దగినట్లు నీయొక్క దివ్యరూపములు సదా యెడబాయక చేరియున్నవని శాస్త్ర వేత్తలు చెప్పుచున్నారు.

చతుఃశ్లోకి సంపూర్ణము.

---

శ్రీః.

శ్రీమతేరామానుజాయనమః.

# అష్టశ్లోకి.

## టీకా తాత్పర్య సహితము.

### తనియన్.

శ్లో. శ్రీపరాశరభట్టార్య శ్శ్రీరంగేశ పురోహితః,
శ్రీవత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసేమే స్తుభూయసే.

టీ. శ్రీరంగేశ = శ్రీరంగనాథస్వామికి
పురోహితః = పురోహితులును
శ్రీవత్సాంక = కూరత్తాళ్వారులకు
సుతః = కుమారులును (అగు)
శ్రీమాన్ = జ్ఞానసంబంధముగల

శ్రీపరాశరభట్టార్యః = శ్రీపరాశరభట్టరనెడి ఆచార్యులు

మే = నాకు

భూయసే = అధికమైన

శ్రేయసే = మేలును

అస్తు = ఒసంగుదురుగాక.

తా. శ్రీమద్రంగనాయకస్వామికి పురోహితులుగాను, శ్రీకూరేశులకు కుమారులుగాను, అధ్యాత్మసంప్రదాయ ప్రవర్తకులుగాను వేంచేసియుండు శ్రీ పరాశరభట్టరనెడి పూర్వాచార్యులు దాసునికి అధికమగు మేలును (పరమపదప్రాప్తి నిమిత్తమైన ఉపాయములను) అనుగ్రహముచేయుదురుగాక.

అవ. రహస్యత్రయమునందు మొదటిదైన తిరుమంత్రమునందు సంగ్రహముగాఁ జెప్పఁబడియుండునట్టి ఉపాయోపేయములను ద్వయము విస్తరించి చెప్పఁబడియుండుటచేతను; ఈద్వయమునందు చెప్పఁబడియుండు ఉపాయోపేయములను బొందుటకు ముఖ్యముగాఁ దెలియవలసినవియగు ఉపాయాంతరత్యాగమును, సర్వపాపనివృత్తియును, చరమశ్లోకము వివరించుటచేతను; ఈరెండు రహస్యములకును మూలభూతముగానుండు ఈ తిరుమంత్రముయొక్క అర్థమును కృపచేయుటకు యత్నించి తిరుమంత్రమునందు ప్రథమమున స్మరించు ప్రణవమునం

దణఁగియుండు అకార ఉకార మకారములయొక్క అర్థమును, ఈ మంత్రశేషముయొక్క పదములైన నారాయణ, నమః, నార, అను పదములు వివరించుటచేతను; వీనికి మూలభూతమైన ఈప్రణవము యొక్క అర్థమునే ప్రథమమున ప్రసాదించుచున్నారు.

శ్లో. అకారార్థోవిష్ణు ర్జగదుదయరక్షాప్రళయకృ
న్మకారార్థోజీవ స్తదుపకరణం వైష్ణవమిదం
ఉకారోనన్యార్హంనియమయతిసంబంధమనయో
స్త్రయీసారస్త్ర్యాత్మాప్రణవ ఇమమర్థంసమదిశత్.

టీ. జగదుదయరక్షాప్రళయకృత్,
జగత్ = లోకములయొక్క
ఉదయ = ఉత్పత్తియును
రక్షా = రక్షణమును
ప్రళయ = సంహారమును
కృత్ = చేయునట్టి
విష్ణుః = సర్వవ్యాపియైనభగవంతుఁడు
అకారార్థః=ప్రణవమందణఁగియుండు అకారమునకువాచ్యుఁడు.
జీవః=బద్ధ ముక్త నిత్యులైన త్రివిధజీవులు

మకారార్థః = ప్రణవమందణఁగియుండు మకారమునను వాచ్యులు.

వైష్ణవం = విష్ణువునుండి కలిగిన

ఇదం = ఈ త్రివిధజీవులును

తదుపకరణం,

తత్ = ఆభగవంతునికి

ఉపకరణం = ఉపయోగింపఁదగినవస్తువుగా (నున్నది).

ఉకారః = ప్రణవమందణఁగియుండు ఉకారవాచ్యమైన
నిరతిశయస్థితియైనది

అనయోః = ఈపరమాత్మ జీవాత్మలయొక్క

సంబంధం = శేషశేషిభావరూపసంబంధమును

అనన్యార్హం = వేఱొక్కరికిని సంప్రాప్తముకాని తెలుంగున

నియమయతి = నియమించుచున్నది.

త్రయీసారః,

త్రయీ = ఋగ్యజుస్సామములనెడి మూఁడువేదములయొక్క

సారః = సారమగు

త్ర్యాత్మా,

త్రి = మూఁడక్షరములైన అకార ఉకార మకారములే

ఆత్మా = స్వరూపముగాఁగల

ప్రణవః = ఓంకారమైనది

ఇమం = మీఁదఁజెప్పిన ఈ యర్థమును

సమదిశత్ = చక్కఁగాఁజెప్పుచున్నది.

తా. లోకములయొక్క సృష్టి స్థితి సంహారకర్తయును, సర్వవ్యాపియునునైన భగవంతుఁడు ప్రణవంబునందణఁగియుండు అకారమునకు అర్థముగానున్నాఁడు. బద్ధ ముక్త నిత్యులైన త్రివిధజీవులు మకారమునకు అర్థముగానున్నారు. భగవంతునివలనఁగలిగిన ఈజీవులు భగవంతునకు శేషభూతులను దానిని అకారమునకుమీఁదలోపించియుండు చతుర్థీవిభక్తి చెప్పుచున్నది. ప్రణవమందణఁగియుండు ఉకారము జీవపరమాత్మలు ఒకరికొకరికిగలిగియుండు శేష శేషిత్వ రూపసంబంధమును, లక్ష్మి, భాగవతులు, ఆచార్యులు అగు వీరికితక్క తక్కినవారికి తగదని నియమించుచున్నది. ఇట్లు వేదత్రయసారమైన ప్రణవమైనది ఈయర్థమును స్పష్టముగాఁ జెప్పుచున్నది. ౧.

అవ. ప్రథమ శ్లోకముచేత ప్రణవమును వ్యాఖ్యానముచేసి యిప్పుడు నమః పదమునుగురించి వ్యాఖ్యానము చేయుచున్నారు.

శ్లో. మంత్రబ్రహ్మణిమధ్యమేననమసాపుంసస్స్వరూపంగతి
ర్గమ్యంశిక్షిత మీక్షితేన పురతః పశ్చాదపిస్థానతః,
స్వాతంత్ర్యంనిజరక్షణం సముచితా వృత్తిశ్చనాన్యో
చితా
తస్యైవేతిహరేర్వివిచ్యకథితంస్వస్యాపినార్హం తతః.

టీ. మంత్రబ్రహ్మణి,
మంత్ర = మంత్రములలో
బ్రహ్మణి = బ్రహ్మమనందగు అష్టాక్షరమునందు
మధ్యమేన = నడుమనుండునట్టి నమః అనుపదము
పురతః = ముందుండునట్టి (ప్రణవముతోఁగూడ)
ఈక్షితేన = చేర్పఁబడియుండు
నమసా = నమః అనుశబ్దముచేత
పుంసః = జీవునియొక్క
స్వరూపం = శేషత్వమగు స్వరూపమైనది
శిక్షితం = శోధింపఁబడుచున్నది.
స్థానతః = అదియుండు స్థానమునందు ఆవృత్తివలన లభ్యమైన
అఖండనమస్సులోఁ జేర్పఁబడియుండు సఖండమైన
నమః పదముచేత

గతిః = పొందఁదగినది (శోధింపఁబడుచున్నది).

పశ్చాత్ = వెనుకనుండు నారాయణాయ అను పదముతోడ
చేర్పఁబడియుండు సఖండమైన నమఃపదముచేత

గమ్యం = పొందఁదగినదైన కైంకర్యము శోధింపఁబడుచున్నది.

తస్య = ఆయొక్క

హరేరేవ = సర్వశేషియగు భగవంతునికే

స్వాతంత్ర్యం = స్వాధీనముగానుండుటయును

నిజరక్షణం = తనను రక్షించుటయును

వృత్తిశ్చ = శేషభూతులైన జీవులకు దగినట్టి కైంకర్యమును

సముచితా = చక్కఁగాఁదగినది.

అన్యోచితా న = ఇతరులకు దగినది కాదు.

ఇతి = ఇట్లు

వివిచ్య = విభజించి

కథితం = చెప్పఁబడినది

తతః = కావున

స్వస్యాపి = పరమాత్మకును తనకును

న, అర్హం = తగినది కాదు.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తా. మంత్రబ్రహ్మమైనట్టి అష్టాక్షరియందలి మధ్యయందుండు నమఃపదమును దీనికిముందుండు ప్రణవముతోడఁజేరిన మకారముతోను, వెనుకనుండు నారాయణాయ అనుపదముతోను, అచ్చటనే రెండు మాఱులు ఆవృత్తిచేసి చేర్పఁబడియుండు నమః అనుపదముతోను, ఇట్లు మూఁడుచోటులయందును అర్థము చేయుటచేత, ఈజీవునికిస్వరూప ఉపాయ పురుషార్థములను నీమూఁడును చక్కఁగా శోధింపఁబడిన వైనవి. ఎట్లన, నమః అను సఖండమైన (రెండుపదములుగా విభజింపఁబడియుండు) నమశ్శబ్దమును ప్రణవముతోఁగూడఁచేర్చి అర్థముచేయుటవలన ఈ జీవుఁడు పరమాత్మకే శేషుఁడు. ఇట్లుతనవాఁడుకాదనిఅర్థముచేయుటవలన ఈజీవునికి స్వతంత్రము నివర్తియై పరమాత్మకే వీఁడు శేషుఁడనెడి స్వరూపము(శేషుఁడనగా, తనకొక ఉపకారమునుప్రధానముగాఁ గలవాఁడుగాక పరోపకారార్థుఁడైయుండుట) చక్కఁగాగనఁబఱచఁబడుచున్నది. ఈ నమఃపదమునే నమః నమః అని రెండుమాఱులు ఆవృత్తిచేసి అచ్చటనే అర్థముచేసినయెడల ఉపాయము (ప్రపత్తి) జీవునిదికాదని అర్థమగుటచేత పరమాత్మచేయింపఁగా జీవుఁడు ఉపాయమునుచేయుటవలన పరమాత్మవలె జీవునికి ఉపాయమునందు ప్రధానకర్తృత్వములేదని ఉపాయస్వరూపము చక్కఁగాఁదెలియపఱచఁబడినది. ఈ నమశ్శబ్దమును వెనుకనుండు నారాయణాయ అనుపదముతోఁజేర్చి అర్థముచేసినయెడల శ్రీమన్నారాయణునికే సకలవిధకైంకర్య

ములును చేయఁగలవాఁడను, నాకొఱకు చేయువాఁడనుగానని అర్థమగుటవలనను, ఆ కైంకర్యమునందు తన ప్రయోజనము నివృత్తియగుట చేతను, ప్రాప్యస్వరూపము చక్కఁగా కనఁబఱచబడినదగుచున్నది. దీనివలన స్వరూపము, ఉపాయము, పురుషార్థము అను నీమూఁడును స్పష్టము గాఁగనఁబఱచఁబడినవి. గనుక స్వామిగానుండుట, తననురక్షించుట, శేషత్వరూపమైన భగవత్కైంకర్యము, ఇవి భగవంతునికే తగునుగాని తక్కినవారికి తగదని సిద్ధించెను. ఇట్లు మూఁడుచోటులయందును చేర్చి అర్థము చేయఁబడియుండు సఖండమైన నమశ్శబ్దము చేత స్వామిత్వము, స్వరక్షణము, కైంకర్యము అను నివి పరమాత్మకే తగినవిగాని, ఈ జీవ పరమాత్మ లిర్వురకిని తగినవి కావు అని సిద్ధించుచున్నది. ఈ జీవుఁడు పరమాత్మకుతక్క వేఱెవ్వరికిని శేషుఁడు కాఁడు. వేఱొక్కరిని రక్షకముగా పొందువాఁడును కాఁడు. అని ఆకారత్రయము సిద్ధించెను. ౨.

అవ. ఇట్లు మొదటి రెండుశ్లోకముల చేత ప్రణవముయొక్కయు నమశ్శబ్దముయొక్కయు అర్థములనువచియించి, ఈశ్లోకము చేత నారాయణశబ్దార్థమును కృపచేయుచున్నారు.

శ్లో. అకారార్థాయైవస్వమహమథమహ్యాన్ననివహా
నరాణాన్నిత్యానామయనమితినారాయణ పదం
యమాహాస్మైకాలం సకలమపి సర్వత్రసకలా
స్వవస్థాస్వావిస్స్యుర్మమసహజకైంకర్యవిధయః.

టీ. అహం = నేను

అకారార్థాయైన = అకారమునకు అర్థమైనపరమాత్మకే

స్వం = శేషుఁడను.

అథ = మఱియును (నేను)

మహ్యం = నాకు

న = శేషుఁడను కాను.

(1) వరాణాం = వరములని చెప్పఁబడెడి

నిత్యానాం = నిత్యములుగానుండు జ్ఞానము, ఆనందము, అమలత్వము, శక్తి, వాత్సల్యము, సౌశీల్యము, ఈ మొదలగుధర్మ గుణములయొక్కయు; దివ్యమంగళ విగ్రహముయొక్క గుణములగు కాంతి, సౌకుమార్యము (మృదుత్వము), మొదలగువానియొక్కయు; దివ్యభూషణములయొక్కయు; దివ్యాయుధములయొక్కయు; నిత్యసూరులయొక్కయు, భగవంతునియొక్క ఉపచారసాధనములైన ఛత్రచామరాదులయొక్కయు; ద్వారపాలకులు, గణాధిపతులు, ముక్తులు, పరమాకాశము, మూలప్రకృతి, బద్ధాత్మలు, కాలము, మహదాది వికారములు, అండములు, అండములమధ్యయందుండు పదార్థములు, అను నీ మొదలగువాని యొక్కయు;

నివహ (స్య) = సమూహమునకు

అయనం = ఆధారము

(2) నరాణాం = నరులని చెప్పఁబడెడి

నిత్యానాం = నిత్యులైనజీవులయొక్క

నివహ(స్య) = సంఘమునకు

అయనం=ప్రాప్యము (పొందదగినది) ప్రాపకము(ఉపాయము.

(3) నరాణాం, నిత్యానాం = నిత్యులైనజీవాత్మలయొక్క

నివహః = సమూహమునకు

అయనం, ఇతి = ఆధారమని

యం = ఏభగవంతుని

నారాయణపదం = నారాయణ అనుపదము

ఆహ = చెప్పుచున్నదో

అస్మై = ఈభగవంతునిపొందుటనిమిత్తము

సకల = సమస్తమైన

కాలం = కాలములయందును

సర్వత్ర = సర్వదేశములయందును

సకలాసు = సమస్తమైన

అవస్థాసు = అవస్థలయందును

మమ = నాకు
సహజకైంకర్యవిధయః = స్వభావముచేఁ గలిగియుండు కైంకర్య[ములు

ఆవిస్స్యుః = పొందఁబడునుగాక.

తా. ప్రణవముయొక్క అకారార్థమైన భగవంతునికి నేను శేషభూతుఁడను. నాకు నేను శేషుఁడను కాను. (దీనివలన ప్రణవనమస్సులయొక్క అర్థములను అనువాదము చేసినట్లు) నర అను శబ్దము నకు నిత్యములని అర్థము. వానిమీఁద జెప్పిన జ్ఞానానందామలత్వాది గుణములు నారము, అనఁగా వానియొక్క సమూహము. ఆయనమ్ అనఁగా ప్రాప్యము ప్రాపకము ఆధారము అని అర్థము. దీనివలన నిత్యములని చెప్పఁబడు జ్ఞానానందాదులకు ఆధారమని సిద్ధించుచున్నది.

పైన జెప్పిన గుణములయందు జ్ఞానాదికాలమువఱకుఁ గలవి దానియొక్క స్థితిచేతనే నిత్యములుగానున్నవి. మహదాది తత్త్వములు ప్రవాహముచేత నిత్యములు. స్థితిచేత నిత్యము లేవియనఁగా, ఉత్పత్తి నాశములు లేక యుండునట్టివి. ప్రవాహనిత్యము లేవియనఁగా, ఉత్పత్తి నాశములు గలవియేయైనను పూర్వమందున్న నామ రూపములు మాఱుపాటు జెందక యుండునట్టివి.

మఱియు నరులు అని చెప్పఁబడు జీవులసమూహమునకు ప్రాప్యులనియును, ప్రాపకులనియును వేఱొక యర్థము. ఈయర్థముచేత భగవంతునికి పరత్వము సిద్ధించుచున్నది.

మఱియు నరులని చెప్పఁబడు జీవులసమూహమును ఆధారము గాఁగలవాఁడు పరమాత్మయని వేఱొకయర్థము. దీనిచేత భగవంతుఁడు అందఱిలోపల ప్రవేశించియున్నాఁడని స్ఫురించుటవలన, భగవంతుఁడే సర్వాంతర్యామియనియును సర్వసులభుఁడనియును చెప్పఁబడుచున్నది.

ఇట్లు ఏభగవంతుని నారాయణశబ్దము చెప్పుచున్నదో, ఆభగవంతునిపొందు నిమిత్తము సర్వకాలములయందును, సర్వావస్థలయందును, సర్వదేశములయందును, నిలుచుట, కూర్చుండుట, పరుండుట, మొదలగు సర్వావస్థలయందును, నాకు స్వభావసిద్ధములుగా నుండు సకలవిధ కైంకర్యములును, వీనికి విరోధములుగానుండు అనాదికర్మములును నివర్తియై తనవలన పొందవలసినది సిద్ధించును. కావున ఈ తిరుమంత్రమునందుండు ప్రణవముచేత ఈజీవులకు విశేషత్వమును, నమశ్శబ్దముచేత పరమాత్మకు పరాధీనముగానుండుటయును, నారాయణశబ్దముచేత పరమాత్మకు కైంకర్యముచేయుటయును చెప్పఁబడినది.

వ. ఇట్లు మూఁడుశ్లోకములచేత తిరుమంత్రముయొక్క అర్థమును తెలియఁజేసి ప్రపన్నులకు తర్వాత నేదేని విషయాంతరములవలన దేహాత్మభ్రమము మొదలగునవి కలుగకయుండునిమిత్తము ఈ అర్థానుసంధానమును అవశ్యముగాఁ జేయవలయునని ప్రసాదించుచున్నారు.

శ్లో. దేహాసక్తాత్మబుద్ధి ర్యదిభవతిపదం
సాధువిద్యాత్తృతీయం
స్వాతంత్ర్యాంధోయదిస్యా
త్ప్రథమమితర శేషత్వధీశ్చేద్ద్వితీయమ్,
ఆత్మత్రాణోన్ముఖశ్చే
న్నమఇతిచపదం బాంధవాభాసలోల
శ్శబ్దంనారాయణాఖ్యం
విషయచపలధీశ్చేచ్చతుర్థీంప్రపన్నః. ౪.

టీ. ప్రపన్నః = ప్రపత్తిచేసినవారికి
దేహే = తమదేహమునందు
ఆసక్త = సంబంధించిన
ఆత్మ = ఆత్మయనెడి
బుద్ధిః = బుద్ధికలవారుగా
భవతియది = అగుదురేని
తృతీయంపదం = మూఁడవపదమైన (మకారము)యొక్క అర్థ
ముఁను,
సాధు = చక్కఁగా

విద్యాత్ = తెలియవలయును.

స్వాతంత్ర్యాంధః,

స్వాతంత్ర్య = స్వతంత్రముగలవాఁడనెడి

అంధః = గ్రుడ్డివారుగా (మూర్ఖులుగా)

భవతియది = అగునురేని

ప్రథమం=ప్రణవమునందలి ప్రథమపదమైన అ-కారముయొక్క

అర్థమును తెలియవలయును.

ఇతరశేషత్వధీశ్చేత్,

ఇతర = భగవంతుఁడు శ్రీదేవి భాగవతులు ఆచార్యులు

వీరుగాక తక్కినవారికి

శేషత్వ = శేషభూతుఁడుగానుండుటయందు

ధీశ్చేత్ = బుద్ధికలుగునేని

ద్వితీయం = ప్రణవమునందలి ద్వితీయపదమైన ఉ-కారము

యొక్క అర్థమును తెలియవలయును.

ఆత్మత్రాణోన్ముఖశ్చేత్,

ఆత్మ = తనయొక్క

త్రాణ = రక్షణమునందు

ఉన్ముఖశ్చేత్ = ప్రయత్నముగలవారగుదురేని

నమఇతిపదం = నమః అనెడి పదముయొక్క అర్థమును తెలియ
వలయును.
బాంధవాభాసలోలశ్చేత్,
బాంధవాభాస = బంధువులుగాతోఁచునట్టివారియందు
లోలశ్చేత్ = ఆశగలవారగు రేని
నారాయణాఖ్యం,
నారాయణ = నారాయణ అనెడి
ఆఖ్యం = అభిధానముగల
పదం = పదముయొక్క అర్థమును తెలియవలయును.
విషయచపలధీశ్చేత్,
విషయ = శబ్దాదివిషయములయందు
చపల = ఆశగల
ధీశ్చేత్ = బుద్ధిగలవారగుదు రేని
చతుర్థీం = నారాయణపదముమీఁదనుండు చతుర్థీవిభక్త్యర్థ
ము.ను (ఆయపదముయొక్క అర్థమును) తెలియవలయును.

తా. భగవంతుని ప్రవృత్తిచేసిన ప్రపన్నులు బుద్ధిభ్రంశముచేత దేహామే ఆత్మయనెడి బుద్ధి మొదలగుదోషములుగల్గినవారై రేని అప్పు డు ప్రణవముయొక్క తృతీయపదమైన మకారార్థమును అనుసంధిం పవలయును. ఆ మకారమువలన జడముగాను అచేతనముగాను నుండు

దేహమునకంటె వేఱైనట్టియు, జ్ఞానానందస్వరూపమైనట్టియు, జ్ఞానానందగుణమైనట్టియు, అణుస్వరూపమైనట్టియు, ఆత్మవస్తువు చెప్పఁబడుటవలన అజ్ఞానము నివర్తియగును.

తాను స్వతంత్రుఁడని భగవచ్ఛేషియైన తనస్వరూపమును మఱచిపోయిరేని అప్పుడు ప్రణవముయొక్క ప్రథమపదమైన అకారార్థమును అనుసంధింపవలయును. దానిమీఁద లోపించియుండు చతుర్థీవిభక్తితోఁడఁగూడిన అకారముచేత సర్వకారణమైనట్టియు సర్వరక్షకమైనట్టియు సర్వసంహారకారకమైనట్టియు లక్ష్మీపతియైనట్టియు సర్వశేషియైనట్టియు పరమాత్మవస్తువు చెప్పఁబడుచున్నది. ఆయర్థమును అనుసంధించుటవలన భగవంతుఁడు సర్వస్వతంత్రుఁడనియును ఈశేషుఁడు ఆభగవంతునికి పరాధీనుఁడనియును జ్ఞానముగలుగుటవలన తాను స్వతంత్రుఁడనెడి అజ్ఞానము నివర్తియగును.

పెరుమాళ్లు, పిరాట్టి, భాగవతులు, ఆచార్యులు తక్క, తక్కిన వారికి తాను శేషుఁడుకావచ్చుననెడి అజ్ఞానముతోఁడఁగూడినవారైయుందురేని అప్పుడు ప్రణవముయొక్క ద్వితీయపదమైన ఉకారార్థమును అనుసంధింపవలయును. ఆ ఉకారమువలన ఈ జీవపరమాత్మలలో ఒకరికొకరికి గలిగియుండు శేషశేషిత్వరూపసంబంధము వేఱొక్కరికిని తగదని చెప్పఁబడుటచేత, తాను పరులకు శేషుఁడు కానగునునెడి అజ్ఞానము నివర్తియగును.

తనను రక్షించుకొనుటకు స్వతంత్రుఁడై ప్రయత్నము చేయు నప్పుడు నమఃపదార్థమును అనుసంధింపవలయును. సఖండనమస్సుతోఁ గూడిన ఆనమశ్శబ్దమువలన ఉపాయము తనది నెడియర్థము స్ఫురించుటవలన ఉపాయమునకు తాను స్వతంత్రకర్తయనెడి అజ్ఞానము నివర్తియగును.

పుత్త్ర, మిత్ర, కళత్రాదులయందు ఆశగలవారుగా నుందురేని అప్పుడు నారాయణపదార్థమును అనుసంధింపవలయును. అనారాయణ పదముయొక్క ద్వితీయార్థమువలన సకలవిధ బంధువులును శ్రీమన్నారాయణుఁడే యనెడి అర్థము స్ఫురించుటచేత, పరులు మనకు బంధువులనెడి అజ్ఞానము నివర్తియగును.

శాస్త్రవిహితముగను శాస్త్రగర్హితముగను నుండు స్త్రీ మొదలగుసర్వవిషయములయందు ప్రేమగలవారుగనుందురేని అప్పుడు నారాయణపదమువీఁదనుండు చతుర్థీవిభక్త్యర్థమును అనుసంధింపవలయును. ఆచతుర్థీవిభక్తివలన శ్రీమన్నారాయణునికొఱకే అతని మనస్సునకు సమ్మతియగునట్లు కైంకర్యము చేయఁగలవాఁడనేగాని, వేఱే విధముగా నామనస్సునకు సమ్మతమగుదాని నేదియు చేయువాఁడనుకాననెడి అర్థము స్ఫురించుటవలన, తన మేలుకొఱకే కలిగినవికావున తనస్వరూపమునకు తగనివియును, అల్ప సుఖములను కలుగఁజేయునవియును, అంత్యమున

విరసము నొసంగునవియును, అస్థిరములైనవియును, జుగుప్సాస్పదములైనవియును నగు స్త్రీ మొదలగు విషయానుభవములయందు ఆశాసక్తులు గలేయు అజ్ఞానము నివర్తియగును.

సకల వేదశాస్త్రార్థములని చెప్పఁబడుఅర్థపంచకమును ఈ తిరుమంత్రమునందు సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నది. ఎట్లన:—

౧. పొందఁదగినట్టి పరమాత్మస్వరూపమును, ౨. దానిని పొందునట్టి జీవస్వరూపమును, ౩. దానిని పొందుటకు సాధనమైన భక్తి ప్రపత్త్యాది ఉపాయ స్వరూపమును, ౪. ఆ ఉపాయములవలన పొందఁదగిన ఫలస్వరూపమును, ౫. దాని విరోధి స్వరూపమును, ఇట్లుగా అయిదు అర్థములు చెప్పఁబడెను. వీనిలో,

౧ ప్రణవమువలన జీవస్వరూపమును, ౨ అఖండనమశ్శబ్దమువలన ఉపాయ స్వరూపమును, ౩ సఖండనమశ్శబ్దమువలన విరోధి స్వరూపమును, ౪ నారాయణ పదమునవలన పరమాత్మ స్వరూపమును, ౫ నారాయణపదముమీఁదనుండు చతుర్థీవిభక్తివలన ఫలస్వరూపమును, ఇట్లు అయిదర్థములు ఈ తిరుమంత్రమునందు చెప్పఁబడియున్నవి.

మఱియును ఈ మూలమంత్రమునందు చెప్పఁబడునట్టి విశేషార్థములనేకములను పూర్వాచార్య విరచిత గ్రంథములందు గనందగును.

అవ. ఇట్లు నాలుగు శ్లోకములచేత మూలమంత్ర వ్యాఖ్యానము చేసి ప్రపత్త్యనుష్ఠానక్రమమును ప్రకాశింపఁజేయునదైన ద్వయమనెడి మంత్రరత్నమును రెండు శ్లోకములచేత కృప చేయుచున్నారు.

శ్లో. నేతృత్వన్నిత్యయోగం
సముచితగుణజాతం తనుఖ్యాపనంచో
పాయంకర్తవ్యభాగం
త్వథమిథునపరం ప్రాప్యమేవం ప్రసిద్ధమ్,
స్వామిత్వంప్రార్థనాంచ
ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాః
మంతారంత్రాయతేచే
త్యధిగతనిగమష్షట్పదోయం ద్విఖండః. ౫.

టీ. నేతృత్వం = పురుషార్థమును
నిత్యయోగం = నిత్యమైన సంబంధమును
సముచితగుణజాతం,
సముచిత = మిక్కిలి తగినవియైన
గుణజాతం = కల్యాణగుణముల సమూహమును
తనుఖ్యాపనం,
తను = దివ్య మంగళవిగ్రహముయొక్క
ఖ్యాపనం = ప్రకాశమును

ఉపాయం = సాధనమును
కర్తవ్యభాగం,
కర్తవ్య = చేయదగిన ఉపాయముయొక్క
భాగం = అంశమును
అథ = మఱియు
మిథునపరం,
మిథున = లక్ష్మీనారాయణరూపమై
పరం = శ్రేష్ఠమై
గమ్యం = పొందదగినదైన
స్వామిత్వం = స్వామిగానుండుటయును
ప్రార్థనాం = ప్రార్థనమును
ప్రబల.....ప్రహాణం,
ప్రబలతర = మిగుల బలముగలవియైన
విరోధి = విరోధులైన అహంకార మమకారములను
ప్రహాణం = వదలుటయును
దశ = (అను) ఈపదియర్థములును
మంతారం = ధ్యానము చేయువారిని
త్రాయతేచ = రక్షించుచున్నది.
ఇతి = ఇట్లు

షట్పదః = ఆఱుపదములు గలదియును
ద్విఖండః = రెండువాక్యములుగలదిగనునుండు
అయం = ఈ ద్వయమనెడి మంత్రమైనది
అధిగతనిగమః,
అధిగత = పొందఁబడిన
నిగమః = వేదముగలదిగానున్నది.

తా. ఈ మంత్రమునందు ఆద్యంతమునందుగల పదములయొక్క- అర్థములను క్రమముగాఁ జెప్పుచున్నారు. ఎట్లన,—

1. శ్రీ మహాలక్ష్మియొక్క- పురుషకారమును, 2 పరమపురుషునితో శ్రీదేవి సర్వకాలములందును ఎడబాయక యుండుటయును, 3 భగవంతుని ఆశ్రయించినవారిని రక్షించుటకు మిగుల తగినవియైన వాత్సల్యము స్వామిత్వము సౌశీల్యము సౌలభ్యము జ్ఞానము శక్తి పూర్తి ప్రాప్తి మొదలగు గుణములయొక్క- సమూహమును, (వీనియందు I వాత్సల్యమనఁగా ఆశ్రితులు అపరాధులుగా నుండినప్పటికిని ఆ యపరాధములను లెక్క-గొనక వారిని రక్షించుటయందు కృపగలవారై యుండుట. II స్వామిత్వమనఁగా సర్వమునకును కర్తగానుండుట. III సౌశీల్యమనఁగా తనశ్రేష్ఠమును పరిగణింపక సామాన్యులతోడను గూడి యుండుట. IV సౌలభ్యమనఁగా సర్వోత్తముఁడైన పరమాత్మ సకలమైనవారును ఆశ్రయించుటకుఁ దగిన దివ్యరూపములను ధరించి

యుండుట. ఈ నాలుగు గుణములును భగవంతుని ఆశ్రయించుటకు దగినవి. V జ్ఞానమనఁగా భగవంతుని ఆశ్రయించిన వారియందుండి పోఁగొట్టవలసిన చెడుపులను వారికి లభింపవలసిన మేలులను తెలిసికొనుటకు తగినట్టిజ్ఞానము. VI శక్తియనఁగా నిత్యసంసారులైనచేతనులను నిత్యసూరి సమాజమునందు చేర్పింపఁదగినదైన భగవంతుని సామర్థ్యము. VII పూర్తియనఁగా సర్వాభీష్టములతో సంపూర్ణమైయుండుట. VIII ప్రాప్తియనఁగా, సర్వవిధములచేతను సకలమయినవారికిని భగవంతుఁడే రక్షకుఁడుగానుండుట. జ్ఞానాది నాలుగు గుణములునుఆశ్రితులయొక్క ప్రయోజనమును ఇయ్యఁదగినవి. 4 దివ్యమంగళవిగ్రహమును తెలియపఱచుటయును,(ఈఅర్థము తిరుమంత్రమునందలి చరణపదమువలన సూచింపంబడినది)5ఉపాయమును, (ఈ అర్థముతిరుమంత్రమునందలి శరణశబ్దార్థమగును ) 6 ప్రపత్తికి అధికారులైన చేతనులు అనుష్ఠింపవలసిన అంశమును, (ఈ అర్థము తిరుమంత్రమునందలి ప్రపద్యే అను పదార్థమగును) 7 లక్ష్మీనారాయణ రూపమైన ఉత్కృష్టస్థానమును,(ఈ యర్థము తిరుమంత్రమునకు పైభాగమందుండు శ్రీమత్ అనెడి పదార్థమగును) 8 శేషిత్వమును, అనఁగా తమకు శేషులైన చేతనులు మొదలగు సకల వస్తువులచేతను పొందదగు ఉత్కృష్టస్థితి, (ఇదితిరుమంత్రమునందు చెప్పిన నారాయణ పదార్థమగును.) 9 సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధ కైంకర్యములును సేను చేయుటకు బాధ్యుడననెడి ప్రార్థనమును,( ఇదితిరుమంత్రమునందలి నారాయణపదమునీఁదను డు చతుర్థీ విభక్తియొక్క అర్థమగును) 10 చేతనులకు

విరోధులైన అహంకారమును(తాను స్వాధీనుడని తలంచియుండుట మమకారమును (తనదని భావించియుండుట) విడుచుటయును,(ఇది తిరుమంత్రమునందలి నమః పదార్థమగును. దీనివలన అజ్ఞాన నివృత్తియును,అనాదికర్మ మూలములైన ప్రకృతి సంబంధాదులయొక్క నివృత్తియును చెప్పబడెను. ఇవి నివృత్తిగాక మీఁదఁజెప్పిన అహంకార మమకారములు నివృత్తికావు.) కావున పైనచెప్పిన ఈ పదియర్థములను అనుసంధించువారిని ఆయుపదములతోడను రెండువాక్యములతోడను గూడినదియును కఠవల్ల్యాద్యుపనిషత్తులయందు ప్రఖ్యాతములైనవియు నగు ద్వయమనెడి యీ మంత్రము రక్షించుచున్నది.

అవ. ఇట్లు మంత్రరత్నముయొక్క పదార్థములను కృపచేసి ఈ అర్థములను అనువాదముచేయువాక్యార్థమును విశదీకరించుచున్నారు.

శ్లో. ఈశానాం జగతామధీశ దయితాం
నిత్యానపాయాంశ్రియం
సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణ
స్యాంఘ్రీహరే రాశ్రయే,
ఇష్టోపాయతయాశ్రియాచసహితా
యాత్మేశ్వరాయార్థయే
కర్తుందాస్యమశేషమప్రతిహతం
నిత్యంత్వహన్నిర్మమః. ౬.

టీ. జగతాం = లోకములకు
ఈశానాం = నియమించునదియును
అధీశదయితాం,
అధీశ = సర్వేశ్వరుఁడైన భగవంతునకు
దయితాం = ప్రియభార్యయైనదియును
నిత్యానపాయాం,
నిత్య = ఎల్లప్పుడును
అనపాయాం = భగవంతుని యెడబాయనిదియును అగు
శ్రియం = శ్రీమహాలక్ష్మీదేవిని
సంశ్రిత్య = శరణుజెంది
ఆశ్రయ . . . . . . గుణస్య,
ఆశ్రయణ = శరణుజెందుటకు
ఉచిత = తగినవియైన
అఖిల = సమస్తములైన
గుణస్య = కల్యాణగుణములుగల
హరేః = ఆశ్రితుల అపరాధములను క్షమించు భగ
వంతునియొక్క
అంఘ్రీ = చరణములను
ఇష్టోపాయతయా,

ఇష్ట = అభీష్టఫలమునకు
ఉపాయతయా = సాధనముగా
ప్రపద్యే = పొందుచున్నా(డను.
శ్రియాచ = శ్రీమహాలక్ష్మితో(గూడ
సహితాయ = నిత్యముగా( జేరియుండునట్టి
ఆత్మేశ్వరాయ,
ఆత్మ = జీవులకు
ఈశ్వరాయ = ఈశ్వరు(డైన పరమాత్మునకు
అహన్తు = నేను
నిర్మమ = అహంకారమమకారములులేనివా(డై
అశేషమ్ = సమస్తమైన
అప్రతిహతం = ఆటంకములేక
నిత్యం = సర్వకాలమును
దాస్యం = కైంకర్యమును
కర్తుం = చేయుటకు
అర్థయే = ప్రార్థించుచున్నా(డను.

తా. లోకములకు ఈశ్వరిగను, సర్వేశ్వరు(డైన భగవంతునకు ఇష్టమహిషిగను, భగవంతునితో నెల్లప్పుడును ఎడబాయకయుండునట్టి దగనునుండు శ్రీమహాలక్ష్మిని పురుషకారముగా శరణమొంది, తర్వాత

ఆశ్రితులు శరణమొందుటకు యోగ్యమగు వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్య జ్ఞాన శక్తి పూర్తి ప్రాప్తి మొదలగుకల్యాణగుణములచే ప్రకాశించువాఁడును సర్వపాపనివారకుఁడును నగు భగవంతునియొక్క దివ్యచరణములను నేను కోరిన మోక్షరూపఫలమునకు సాధనముగా, లేక నేను కోరినఫలమునకు సులభోపాయముగా పొందుచున్నాఁడను. (ఇది ద్వయముయొక్క పూర్వఖండార్థము). ఇట్లు శరణాగతులకు పురుషకారమునుజేయు శ్రీమహాలక్ష్మీదేవితోఁ గూడియుండునట్టియు సర్వాత్మలకును ఈశ్వరుఁడును నైన శ్రీమన్నారాయణునకు దాసుఁడు అహంకార మమకారములులేనివాఁడై సర్వవిధకైంకర్యములను సర్వకాలములయందును సర్వావస్థలయందును చేయుటకు ప్రార్థించుచున్నాఁడను. (ఇది ఉత్తరఖండముయొక్క అర్థము).

ఇచ్చట ఈ లోకములకు ఈశ్వరియనియును భగవంతునికి యిష్టమహిషియనియును పైన చెప్పిన రెండు విశేషణములచేత పురుషకారోపయోగియైన ఆశ్రితులయందు వాత్సల్యమనెడి ప్రియము చెప్పఁబడుచున్నది. శ్రీయనెడి శబ్దమునకు ఆఱర్థములుగలవు. ఎట్లన,

(1) చేతనులవలన చెందఁబడునట్టిది. ఇందువలన అపరాధులైన చేతనులకు కావలసిన వాత్సల్యమను గుణము చెప్పఁబడుచున్నది.

(2) భగవంతుని పొందియున్నది. ఇందువలన భగవంతుని తన వశము చేసికొనునట్టి మహిమ చెప్పఁబడుచున్నది.

(3) ఆశ్రితుల విన్నపములను వినుచున్నది. ఇందువలన ఆశ్రితుల మొఱ నాలకించి ఫలమొసంగుటను చెప్పఁబడుచున్నది.

(4) తనను ఆశ్రయింపనివారికిని హితమునుబోధించి వారిని వినునట్లు చేయుచున్నది. ఇందువలన తనయందు విముఖులైయుండు చేతనులకును హితోపదేశముచేయుటను చెప్పఁబడుచున్నది.

(5) ఆశ్రితులదోషములను నాశము చేయుచున్నది. ఇందువలన ఆశ్రితులగు చేతనులయొక్క దోషములను పోఁగొట్టుటను చెప్పఁబడుచున్నది.

(6) ఆశ్రితులను గుణములచే శ్రేష్ఠులనుగాఁ జేయుచున్నది. ఇందువలనఆశ్రితులకు సద్గుణములను వృద్ధిచేయుటను చెప్పఁబడుచున్నది.

ఇట్లు శ్రీ యనుపదము మహాలక్ష్మీదేవికి ప్రధాన నామముగానున్నది. ఈమె సకలమైనవారికిని మాతకావుటచేతను, తక్కినవారందఱికంటె సంపూర్ణలక్షణము గలిగియుండుటచేతను, భగవంతునికి పురుషకారము చేయుటకై సకలమైన దివ్యగుణములతోఁ గూడిన శ్రీదేవిని శరణుపొంది; ఆశ్రితులుశరణుచొచ్చుటకు తగినట్టి వాత్సల్య స్వామిత్వ సౌశీల్యసౌలభ్య జ్ఞాన శక్తి పూర్తి ప్రాప్తులనెడి కల్యాణ గుణములతో ప్రకాశించు భగవంతుని దివ్యచరణములను దాసుఁడు కోరిన ఫలమును సులభోపాయముగా పొందుచున్నాఁడను. ఇవ్విధముగా శ్రీమహాలక్ష్మిని యొడబాయక సకల జీవులకును ఈశ్వరుఁడుగ నుండు శ్రీమన్నారాయ

ణునకు నేను అహంకార మమకారములు లేనివాఁడనై సకలవిధ కైంకర్యములను సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును ఏయొకవిరోధనమును లేక చేయుటకై ప్రార్థించుచున్నాఁడను.

అవ. ఇట్లు మన్త్రరహస్యమైన ద్వయమునకు వ్యాఖ్యానము చేసి ఇప్పుడు ఆద్వయార్థమునకు వివరణమును, భగవంతుఁడు చేతనోజ్జీవనార్థము కృపచేసినదియును నగు చరమశ్లోకమునకు వ్యాఖ్యానముగా నీశ్లోకమును కృపచేయుచున్నారు.

శ్లో. మత్ప్రాప్త్యర్థతయా మయోక్తమఖిలం
సన్త్యజ్యధర్మం పున
ర్మామేకంమదవాప్తయే శరణమి
త్యార్తోవసాయం కురు,
త్వామేవంవ్యవసాయయుక్త మఖిల
జ్ఞానాదిపూర్ణోహ్యహం
మత్ప్రాప్తిప్రతిబంధకై ర్విరహితం
కుర్యాంశుచ మ్మాకృథాః. 2.

టీ. మత్ప్రాప్త్యర్థతయా,
మత్ — నాయొక్క—

# అష్టశ్లోకీ.

ప్రాప్తి = ప్రాప్తిని (పొందుటను)
ఆర్థతయా = ప్రయోజనముగాఁ గలిగియుండుటవలన
మయా = నాచేత
ఉక్తం = చెప్పఁబడియుండు
అఖిలం = సమస్తమైన
ధర్మం = కర్మయోగ జ్ఞానయోగములతోఁ గూడిన
భక్తియోగమును
సంత్యజ్య = చక్కఁగా విడిచి.
ఏకం = ఒక్కఁడైన
మాం = నన్ను
ఆర్తః = దుఃఖపడెడినీవు
మదవాప్తయే = నన్ను బొందుటకు
శరణమితి = ఉపాయమని.
అవసాయం = నిశ్చయమును
కురు = చేయుము.
ఏవం = ఈప్రకారముగా
వ్యవసాయయుక్తం,
వ్యవసాయ = నిశ్చయముతోఁగూడ,
యుక్తం = కూడియుండు

త్వాం = నిన్ను
అఖిలజ్ఞానాదిపూర్ణ్ణః,
అఖిల = సమస్తమైన
జ్ఞానాది = జ్ఞానమే ప్రధానముగాఁగలదివ్యగుణములవలన
పూర్ణ్ణః = నిండినవాఁడైన
అహం = నేను
మత్ప్రాప్తి ప్రతిబంధకైః,
మత్ = నన్ను
ప్రాప్తి = పొందుటకు
ప్రతిబంధకైః = విరోధములైన అనాదిపుణ్యపాప రూపములగు
సర్వ కర్మములచేతను
విరహితం = విడువఁబడినవాఁడుగా.
కుర్యాం = చేయఁగలవాఁడను.
శుచం = వ్యసనమును
మాకృథాః = పొందవలదు.

తా. నన్ను పొందుటకు సాధనములుగాఁ జెప్పఁబడియుండు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములనెడి మోక్షసాధనములను అనుష్ఠించుటకు శక్తి లేదని వ్యసనపడవలదు. నీవు నన్నొకనినే ఉపాయముగా నిశ్చయింపవలయును. ఇది చరమశ్లోక పూర్వార్థము.

ఇచ్చట కర్మయోగాదులను అనుష్ఠింపక నన్నొకనినే శరణు పొందిన చాలునని చెప్పినంతమాత్రమున నిత్యనైమిత్తికాది ప్రపత్తిసాధనములనుకూడ వదలిపెట్టవచ్చునని యూహింపఁదగదు.

ఇట్టి నిశ్చయముతోఁగూడిన నిన్ను జ్ఞానశక్త్యాది గుణములతోఁ గూడిన నేను, నన్ను పొందుటకు విరోధములైయుండు పుణ్యపాపరూపములైన సర్వకర్మములయందుఁడి నివర్తిచేసెదను. దుష్కరమై అపాయకరమైయుండు కర్మయోగాది సాధ్యోపాయములను చేయుటకు శక్తుఁడను కాను కదాయని చింతింపవలదు.

ఇచ్చట భగవంతునిఁబొందుటకు విరోధులైనవియెల్లను పాపములని చెప్పఁబడుచున్నవి. అవి యేవనఁగా, అవిద్య, కర్మము, వాసన, అభిలాష, ప్రకృతిసంబంధము, దానిభేదమైన దేహాత్మాభిమానము, దానిని సంబంధించిన అహంకారమమకారములు అనునవి.

అవిద్యయనఁగా, జ్ఞానహీనము. ఇది అజ్ఞానము, అన్యథాజ్ఞానము, విపరీతజ్ఞానము, అని మూఁడువిధములు. వీనిలో అజ్ఞానమనఁగా, మూఢత్వము. అన్యథాజ్ఞానమనఁగా, ఒకటిని వేఱొకటిగాఁదెలియుట. విపరీతజ్ఞానమనఁగా, శత్రువును మిత్రునిగా భావించుట.

కర్మమనఁగా, ఇదిపుణ్యమనియు పాపమనియు రెండువిధములు. పుణ్యకర్మము ఫలాపేక్షాసహితమైనది. పాపకర్మము పరహింసాకరమైనది.

ఇచ్చట పుణ్యకర్మములును పాపకర్మములనలె మోక్ష విరోధములు. ఈరెండు కర్మములును పూర్వాఘములనియును ఉత్తరాఘములనియును ఒక్కొక్కటియును రెండువిధములు. పూర్వాఘములనఁగా, తాము ప్రపత్తిని అనుష్ఠించుటకు పూర్వముచేయఁబడుకర్మములు. ఉత్తరాఘము లనఁగా, ప్రపత్తిని అనుష్ఠించిన అనంతరము చేయఁబడు కర్మములు.

వాసన యనఁగా, అనాదిగా తాము చేయుచువచ్చిన కార్యములను, ఇప్పుడును తమయిష్టము లేకయే చేయుచుండునట్టి అభ్యాసము. అభిలాషయనఁగా, ఇంద్రాది మహాభోగములు మొదలగునవి. ప్రకృతి సంబంధమనఁగా, స్థూలసూక్ష్మరూపమైన దేహసంబంధము. మఱియు పూర్వాఘములు సంచితకర్మములనియును, ప్రారబ్ధ కర్మములనియును రెండువిధములు. సంచితమనఁగా, కర్మములయొక్క ఫలములను నిచ్చుటకు ప్రారంభింపని కర్మములు. ప్రారబ్ధ మనఁగా, కర్మములయొక్క ఫలములను నిచ్చుటకు ప్రారంభించిన కర్మములు.

మఱియు ఈప్రారబ్ధకర్మములు అభ్యుపగత ప్రారబ్ధకర్మములనియును, అనభ్యుపగత ప్రారబ్ధకర్మములనియును రెండువిధములు. అభ్యుపగత ప్రారబ్ధకర్మములనఁగా, తాము ప్రపత్తిచేయునప్పుడు అనుభవించుటకుసమ్మతించిన ప్రారబ్ధకర్మములు. ఎట్లన; ప్రపత్తిచేయునప్పుడు తమ దేహావసానకమునందు మోక్షమునుగోరి ప్రపత్తి చేసినయెడల దేహముం

డుపర్యంతమును అనుభవింపవలసిన ప్రారబ్ధకర్మములు అంగీకరింపఁబడినవి యాయెను. అనభ్యుపగతప్రారబ్ధములనఁగా, ప్రపత్తి చేయునప్పుడు తాము అనుభవించుటకు సమ్మతింపని ప్రారబ్ధకర్మములు. ఎట్లన, మిగుల జ్ఞానాధికులైన ఆర్తప్రపన్నులు తమయొక్క ప్రారబ్ధకర్మములను అనుభవించుటకుసమ్మతింపక, తాము ప్రపత్తిచేసినతోడనే మోక్షము లభింపవలయునని కోరి యనుష్ఠించునట్టి ప్రపత్తియందు తత్క్షణమే మోక్షము సంప్రాప్తమగుటవలన, వారప్పుడు అనుభవింపవలసిన ప్రారబ్ధకర్మములు అంగీకరింపఁబడనివి యాయెను.

ఈ చెప్పఁబడిన ఉత్తరాఘములు బుద్ధిపూర్వకములనియును, అబుద్ధిపూర్వకములనియును రెండువిధములు. బుద్ధిపూర్వోత్తరాఘములు ప్రాయశ్చిత్తముచే నివర్తియగుచున్నది. ప్రాయశ్చిత్తము చేయకపోయినను అనుభవమువలన నివర్తి యగుచున్నది. భక్తియోగమనెడి ఉపాయాంతరమును అనుష్ఠించినవారికి పైనచెప్పిన కర్మములయందు ప్రారబ్ధకర్మములును ప్రాయశ్చిత్తముచేయని ఉత్తరాఘములును అనుభవముచేతనే నివర్తి యగుచున్నది. అబుద్ధిపూర్వోత్తరాఘములు తామనుష్ఠించిన ప్రపత్తిబలముచేత నివర్తి యగుచున్నది.

దృప్తప్రపన్నులకు అభ్యుపగత ప్రారబ్ధకర్మములును, ప్రాయశ్చిత్తములేని బుద్ధిపూర్వోత్తరాఘములును అనుభవింపఁగా నివర్తి యగుచున్నది. సంచితకర్మములును, అనభ్యుపగత ప్రారబ్ధకర్మములును, ప్రపత్తివలన నివర్తియగుచున్నది. అబుద్ధి పూర్వోత్తరాఘములు వారిని చెందవు.

ఆర్తప్రపన్నులకు ఈ కర్మములన్నియును వారనుష్ఠించిన ప్రపత్తి వలన నివర్తియగును. ఆర్తప్రపన్నులకు ప్రపత్తిని యనుష్ఠించినతోడనే మోక్షము సిద్ధించుటచేత వీరికి ఉత్తరాఘము లేదు. ఇచ్చట మోక్ష విషయమును, తద్విరోధములైన సకలపాప నివర్తులను చెప్పవలసి యుండఁగా, పాపనివర్తనములను మాత్రము చెప్పఁబడినదానికిం గారణ మేమనఁగా, మోక్షవిరోధములైన పాపనివర్తనములు చెప్పినమీఁద సిద్ధిం పఁబోవునది మోక్షమే కావున, మోక్షవిషయమునుగూర్చి ప్రస్తావన చేయలేదు.

అవ. పైశ్లోకమువలన తమకుఁ గల్గియుండు శోకమునకు కారణమును, అది నివర్తియగు విధమును తెలియఁజేచి, తమకు ఆత్మరక్షణమునందు భయము లేదని యనుసంధించుచున్నారు.

శ్లో. నిశ్చిత్యత్వదధీనతా మ్మయిసదా
కర్మాద్యుపాయాన్హరే
కర్తుంత్యక్తుమపి ప్రపత్తుమనలం
సీదామి దుఃఖాకులః,
ఏతజ్జ్ఞానముపేయుషో మమ పున
స్సర్వాపరాధక్షయం
కర్తాసీతిదృఢోస్మి తేతు చరమం
వాక్యం స్మరన్సారథేః. ౮.

టీ. హరే = అఖిలదోషములను బోఁగొట్టు భగవంతుఁడా!

మయి = నాయందు

సదా = సర్వకాలమును

త్వదధీనతాం,

త్వత్ = నీయొక్క

అధీనతాం = అధీనముగా నుండుటను

నిశ్చిత్య = నిశ్చయించి

కర్మాద్యుపాయాన్,

కర్మ = కర్మయోగము

ఆది = మొదలుగాఁగల

ఉపాయాన్ = ఉపాయములను

కర్తుం = చేయుటకును

త్యక్తుం = విడుచుటకును

ప్రపత్తుమపి = ప్రపత్తిచేయుటకును

అనలం = అశక్తుఁడైన నేను

దుఃఖాకులః,

దుఃఖ = వ్యసనము చేత

ఆకులః = కలఁతనొందినవాఁడై

సీదామి = శోకమొందెదను.

సారథేః = పార్థునకు సారథిగానున్న
తే = నీ యొక్క
చరమం = కడపటిదైన
వాక్యం = వాక్యమును
స్మరణ్ = తెలిసినట్టినేను
ఏతత్ = ఈ
జ్ఞానం = ప్రపత్తిరూపజ్ఞానమును
ఉపేయుషః = పొందియుండునట్టి
మే = నాయొక్క
సర్వాపరాధక్షయం,
సర్వ = సమస్తమైన
అపరాధ = అపరాధములయొక్క
క్షయం = నాశమును
కర్తాసి = చేయుదువుగాక
ఇతి = అని
దృఢోస్మి = దృఢమనస్కుడగుచున్నాడను.

తా. ఆశ్రితపాపహరుడగు భగవంతుడా! నేనెల్లప్పుడును నీకు పరాధీనుడ నగుటంజేసి కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగము లగు మోక్షోపాయములను అనుష్ఠించుటకు నాకేయొక్క స్వాతంత్ర మును లేదు. అయినను శాస్త్రములయందు చేతనులను ఉద్దేశించి యీ ఉపాయములను అనుష్ఠించునట్లు నీవు విధించి యుండుటచేత, ఈ

యుపాయములను అనుష్ఠించుటకు దాసునికి నీవలన స్వాతంత్ర్య మొసంగఁబడిన దైనది. అట్లుండియును మిగుల అల్పజ్ఞానములతోడఁ గూడిన దాసుఁడు వీనిని అనుష్ఠింపక యుండవచ్చునన్ననో, మోక్షాపేక్షగల దాసునకు అవి సాధనములుగా నుండుటవలన వీనియం దభిలాష యున్నది. అయినను అనుష్ఠించుటకో అశక్తుఁడనై యున్నాఁడను. ఈ ఉపాయములను అనుష్ఠించుటకు అశక్తులుగా నుండువారిని యుద్దేశించి సులభోపాయముగా శాస్త్రములయందు విధింపఁబడియుండు ఈ ప్రపత్తిని అనుష్ఠింప నగుఁగదా యనఁగా, దీనికి అంగముగా విధింపఁబడి యుండు కర్మలయందు విశ్వాసము లభించుట మిగుల దుస్తరముగాన, ఈ ప్రపత్తిని అనుష్ఠింపన సమర్థుఁడనుగానున్నాఁడను. ఇట్లు ఏ యొక్క గతియును లేక దుఃఖాకులమానసుండనైన దాసునకు అర్జునునకు సారథిగా నున్నప్పుడు ఉపదేశించిన నీయొక్క కడపటివాక్యమైన గీతాశాస్త్రమందలి చరమశ్లోకమునందు నన్ను నీవు శరణుపొందుము, నిన్ను నేను సకలవిధములైన పాపములనుండి రక్షించెదను, అని దేవరవారు కృపచేసినదానిని తలంచి, ఇందు మహావిశ్వాసముగలవాఁడనై ఈ ప్రపత్తిని అనుష్ఠించితిని. దీనివలన దేవరవారు దాసుని పాపములను నివర్తి చేయుదురని దృఢమైన నమ్మికతోఁ గూడినవాఁడుగా నున్నాఁడను.

అష్టశ్లోకీ ఆంధ్రటీకా తాత్పర్య సహితము

సంపూర్ణము.

---

# ప్రకటన.

భగవద్గీతార్థ సంగ్రహము:— ఆంధ్ర తాత్పర్య సహితము:— ఇది యిదివఱకును ఆఱుకూర్పులు ముద్రింపఁబడి విక్రయింపఁబడినది. ఈ ఏడవకూర్పు చాలా బాగుగ ముద్రింపఁబడి మంచి బైండు చేయబడి యున్నది. దీనికే తాశీల్ రామయ్యగారి భగవద్గీతలనియును, చివుకుల రామయ్యగారి భగవద్గీత లనియును పేరు గలదు. తెనుఁగునందు తాత్పర్యముతోడను, అంగన్యాస కరన్యాసములతోడను, గీతా మాహాత్మ్యముతోడను, సులభమైన తాత్పర్యముతోడను, పారాయణమునకు యోగ్యముగా నొకవైపున శ్లోకములును, మఱియొకవైపున తాత్పర్యమునుగా ముద్రించి చేతికి యిమిడికయగు సైజునందు శ్రీకృష్ణమూర్తి రథసారథిగానుండు ప్రతిమతో బంగారు గిల్టు వేయఁబడి ఆస్తికుల చేతియందలంకరించిన భగవద్గీత యిది యొకటియే మొదటిది!

దీనిం బట్టి ఈ గ్రంథ మహిమ యిట్టిదనిబుద్ధిమంతుల గువాడు తెలిసికొౌన గలరుగాన విశేషించి వ్రాయలేదు. దీనివెల ప్రతి 1కి 0-14-0. పది ప్రతులకు 1 ప్రతి ఇనాము. 50 ప్రతులకు 10 ప్రతులు ఇనాము.

---

ముకుందమాల స్తోత్రము:— ఇది శ్రీ కులశేఖరాళ్వారులచే రచితమైనది. ఇందు కులశేఖరాళ్వారుల చరిత్రమును, ముకుందమాలా నామావళియును, ప్రతి శ్లోకమునకును అవతారికయును, ప్రతిపద టీకయును, తాత్పర్యమును చేర్చి మంచికాగితములలో చిన్నసైజున ముద్రింపించియున్నారము. దీనివెల ప్రతి1కి 0-4-0

నానాదేశపు సామెతలు:— హిందూస్థాని బంగాళము కేరళము కర్ణాటకము జర్మని మొదలగు దేశముల లోని సామెతలను తెనిగింపఁబడి యుండుటయేగాక సంస్కృతలోక్తులను క్రొత్తగాజేర్చి వానికి తెనుగు తాత్పర్యమును వ్రాయంబడియున్నది. ఇది పండితులకును పామరులకును విద్యార్థులకును చాలా ఆవశ్యకమైనది. రెండవ కూర్పు. మంచికాగితములు. దీనివెల ప్రతి 1కి 0-2-0.

ధనంజయ నిఘంటు:— మొదటితూరి అచ్చువేసిన ప్రతులన్నియు అమ్మిపోయినది. మఱల పలువురు కోరినందున ముందుకంటె చక్కగా ముద్రించియున్నారము. అమరసింహకృత త్రికాండమునుమాత్రము చదువుటచేత సంపూర్ణ భాషాజ్ఞానమును పదయోజన పద్ధతియును కలుగదు. అమరసింహమునకు ఇది చాలా సహాయకారిగా నుండుటయేగాక అందులేని అనేకపదములిందు గలవు. మరియు వ్యుత్పత్తిజ్ఞానము చక్కగా అలవడును. సుబోధముగ, తెనుఁగుటీక వ్రాయబడియున్నది. విద్యార్థులకును విద్వాంసులకునుకావలసినది.

దీనివెల ప్రతి ౧కి 0-6-0.

హఠయోగ ప్రదీపిక:— శ్లోకమును, తెనుఁగు తాత్పర్యమును, విశేషార్థములును, 104 యోగాసన పటములును, రాజయోగ సిద్ధాంతమును గలది.

ఇందు హఠ లయ రాజయోగములును, యమనియమాసనములును, సూర్యభేదనాదికుంభకములును, ధౌత్యాది క్రియలును, ప్రాణాయామాదిభేదములును, దశవిధముద్ర

లును, సమాధిక్రమములును, శాంభవి మొదలగుచిన్ముద్రలును, నాదానుసంధానమును, ప్రత్యాహారాది లక్షణములును, ఇంకను అనేకములైన యోగ రహస్య విషయములునుగలవు. వేయేల! దీనికంటె శ్రేష్ఠమైన రాజయోగ శాస్త్రమును, వేదాంతశాస్త్రమును, ప్రపంచమునందు వేఱ లేనేలేదు. దీని వెల ప్రతి ౧కి 3-0-0.

విచార సాగరము:— ఎన్ని వేదాంత గ్రంథములైనను ఈ ఒక్క విచారసాగర గ్రంథమునకు సాటిరానేరదు. దీని వెల వి. పి. చార్జితో 3-0-0.

సకలార్థసాగరము:—. రెండవకూర్పు. మొదటికూర్పుకంటె ఇందు అనేకవిషయములు చేర్పంబడి యున్నవి. దీని వెల వి. పి. చార్జితో 2-0-0.

లోకరహస్యము:— ఇందు 100 విషయములుగలవు. సకలమైనవారును చదువదగినది. దీని వెల 0-8-0.

వలయువారు మద్రాస్ పచ్చయప్పకాలేజికి ప్రక్కన పుస్తకషాపులో పి. నంబెరుమాళ్లు శెట్టిగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

